శ్రీరస్తు.

శ్రీవిశ్వేశ్వరాయనమః.

# కాశీమజిలీ కథలు

(ఉత్తరఖండానుబంధము.)

## కాదంబరికథ.

ఇది

గోదావరీ తీరస్థితం బగు

రాజమహేంద్రవరపురంబున నివసించియున్న

మధిర సుబ్బన్న దీక్షితకవిచే

సంస్కృత—కాదంబరినుండి

తెలిగింపఁబడి

వారి పౌత్రుడు మధిర శివరామకృష్ణశాస్త్రి చే

ప్రకటింపఁబడినది.

ముద్రణః

అవంతీ ప్రెస్, రాజమండ్రి.

ప్రతులు 1000

1956.



[ప్రతి వెల రు 2—0—0

# ఇందు వచ్చు పాత్రలు

## పురుషులు

1 శూద్రకమహారాజు—కథానాయకుని యపరావతారము
2 తారాపీడుఁడు—కథానాయకుని తండ్రి.
3 శుకనాసుఁడు—తారాపీడుని మంత్రి.
4 చంద్రాపీడుఁడు—కథానాయకుడు.
5 పుండరీకుఁడు—మహాశ్వేతచే వరింపఁబడినవాఁడు.
6 కపింజలుఁడు—పుండరీకుని మిత్రుఁడు.
7 హంసుఁడు—మహాశ్వేత తండ్రి.
8 చిత్రరథుడు—కాదంబరి తండ్రి.
9 వైశంపాయనుఁడు—పుండరీకుని యపరావతారము.
10 కేయూరకుఁడు—కాదంబరి వీణావాహకుఁడు.
11 మేఘనాథుఁడు—కథానాయకుని సేనాధిపతి.
12 జాబాలి—ఈకథ చెప్పిన మహర్షి.
13 హారీతకుఁడు—జాబాలి కుమారుఁడు.

## స్త్రీలు.

1 కాదంబరి—కథానాయకురాలు.
2 మహాశ్వేత—కాదంబరి స్నేహితురాలు.
3 విలాసవతి—కథానాయకుని తల్లి.
4 మనోరమ—వైశంపాయనుని తల్లి.
5 పత్రలేఖ—చంద్రాపీడుని తాంబూలదాయిని.
6 మదలేఖ—కాదంబరి సఖురాలు.
7 తరళిక—మహాశ్వేత సఖురాలు.
8 మదిర—కాదంబరి తల్లి.
9 గౌరి—మహాశ్వేత తల్లి.

# పీఠిక.



ఈ ప్రబంధమును సంస్కృతమున గద్యముగా రచించినవాఁడు బాణకవి. ఇతఁడు శ్రోత్రియ బ్రాహ్మణుఁడు. వాత్స్యాయన సగోత్రుఁడు. హర్షవర్ధనుని యాస్థానకవి. మయూరకవికి మేనమామ. శోణానదీకూలముననున్న ప్రీతికూటమితని జన్మభూమి. తల్లి రాజదేవి. తండ్రి చిత్రభానుఁడు. తాత యర్థపతి. ముత్తాత కుబేరుఁడు. ఇతండు జనించిన యాఱవదినమునఁ దల్లియుఁ బదునాలుగవ వత్సరమునఁ దండ్రియు మృతినొందిరి. ఈకవి హర్షచరిత్రమను మఱి యొక గద్య కావ్యమునఁ దనచరిత్రయంతయుఁ దెల్లముగాఁ జెప్పి కొనియెను.

హర్షవర్ధనుఁ డాఱవశతాబ్దములో రాజ్యము చేయుచున్నట్లు పెక్కు నిదర్శనము లుండుటచే బాణకవియు నాఱవశతాబ్దము చివరగాని, యేడవశతాబ్దము మొదటఁగాని యుండవలయును. కావున నిప్పటి కించుమించుగాఁ బదమూఁడువందల సంవత్సరముల క్రితము వాఁడని తోఁచుచున్నది. ఇతఁ డంత్యదశయందీ గ్రంథమును రచించెను. కాదంబరి, పత్రలేఖచేఁ జంద్రాపీడునకు సందేశము పంపునప్పుడు 1724 గద్యము 'జ్ఞాస్యసి మరణేన ప్రీతిమిత్యసంభావ్యం' అని వ్రాసి యందుఁగల యశ్లీల దోషంబున నతండు హటాత్తుగా మరణము నొందెనని చెప్పుదురు.

బాణకవి కుమారుండు తరువాతికథఁ బూర్తిజేసెను. దానికే యుత్తరభాగమని పేరు. బాణకవి కథాసరిత్సాగరములోని శక్తియశో లంబకమునందలి మూఁడవతరంగమున గోముఖుఁడనువాఁడు నరవాహనదత్తునకు వినోదమునకై చెప్పినకథనే కాదంబరిగా రచిం

రశ్మిమంతునికిఁ బుండరీకుఁడనియు, సోమప్రభునకుఁ జంద్రాపీడుఁడు, మనోరథ ప్రభకు మహాశ్వేత, మకరందికకుఁ గాదంబరి, యనియుఁ బేరులుమాత్రము మార్చి వ్రాసెను. ఇట్టి ప్రౌఢకవి ప్రత్యేకము తానొక కథను గల్పించి వ్రాయక యొకరు వ్రాసినకథనే తీసికొని రచించుటకుఁ గారణము వ్యంగ్యమైయున్నది. కథ అదియేయైనను పాత్రోచితమైన సంభాషణములు స్వభావవర్ణనలు శయ్యా రీతి పాకాదు లిట్టివి మరియొక గ్రంథమునఁ గనంబడవు. దేనివర్ణించినను నెదురఁబెట్టి కన్నులకుం జూపునట్లు స్వభావోక్తిగాఁ దెలియఁజేయును. ఈగ్రంథము రచించుటచేతనే 'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అను వాడుక వచ్చినది.

ఇందుఁ గాదంబరీ మహాశ్వేతలను గంధర్వ రాజపుత్రికల చారిత్రము విప్రలంభశృంగారరసపూరితముగా వర్ణింపఁబడియున్నది. గ్రంథమంతయుఁ జదివినఁగాని యిందలి కథాచమత్కారము తెలియం బడదు. దీని సమముగాఁ దెలిగించినచోఁ జదువరులకు సులభగ్రాహ్య ముగాదని విశేషవర్ణనల వదలి కథమాత్రమే వ్రాసితిని.

## క థా సం గ్ర హ ము.

దేవలోకములో శ్వేతకేతుఁడను మహర్షి ఆకాశగంగలో దేవతార్చనకుఁ బద్మములు గోయుచుండఁగాఁ బద్మసన్నిహితయైన లక్ష్మి కతనిఁజూచినతోడనే చిత్తచాంచల్య మైనందున సద్యోగర్భం బునఁ బుండరీకుఁడను కుమారుఁ డుదయించెను. సుందరరూపుఁడగు నతఁ డొకనాఁడు కపింజలుఁడను మునికుమారునితోఁగూడ నచ్ఛోద సరస్సునకు స్నానమునకై యరిగెను. అక్కడికే తల్లితోఁగూడ స్నానమునకై వచ్చిన మహాశ్వేత యనుగంధర్వకన్యక పుండరీకుని మోహించి యతని మరులుకొలిపి భావమువ్యక్తపరచియు మాటాడక తల్లితో నింటికిఁబోయినది.

మరణతుల్యమగు పుండరీకుని విరహవేదన జూచి కపింజలుఁ డమ్మహాశ్వేతయొద్దకుఁబోయి తెలియఁజేసెను. ఆరాత్రియే తరళిక యను పరిచారికను వెంటఁబెట్టుకొని మహాశ్వేత పుండరీకునొద్దకు వచ్చినది. ఈలోపుగనే చంద్రోదయమైనంతఁ బుండరీకుఁడు విరహ బాధఁ బడలేక నీవుకూడఁ బుడమిం జనించి నావలెనే విరహతాపం బున మృతినొందుమని చంద్రుని శపించెను. చంద్రుఁ డతని నట్లే మరల శపించెను. మహాశ్వేతయు మృతుఁడైయున్న పుండరీకుని జూచి శోకించుచు నాకాశవాణిచే నూరడింపఁబడి యోగినియై యా సరస్సీరమందే తపంబుఁజేయుచుండెను.

పుండరీకునిచే శపింపఁబడిన చంద్రుఁడు తారాపీడుని కుమారుండై యుదయించి చంద్రాపీడుఁడను పేరుతో పుండరీకావతారమైన వైశం పాయనుఁ డను మంత్రి పుత్రునితో గూడికొని దిగ్విజయయాత్ర జేయుచు నొక యరణ్యమధ్యంబున సేనల నిలిపి కిన్నెర మిథున మూలముగఁ జంద్రాపీడుఁ డా యచ్ఛోదసరస్సునకుఁ బోయి మహాశ్వేతం గాంచి తన కథఁజెప్పి యామె వృత్తాంతమును విని యోదార్చెను. మఱియు మహాశ్వేత సఖురాలు కాదంబరి యనుచిన్నది సఖురాలిమూలమునఁ దాను వివాహమాడనని శపథము జేయుటయు దానితండ్రి మందలింపుమని మహాశ్వేతకు వర్తమానమును బంపెను.

అప్పుడు మహాశ్వేత కాదంబరిని పెండ్లియాడుమని మందలించు టకుఁబోవుచు ఒకనాఁడు చంద్రాపీడునిగూడ వెంటఁబెట్టికొని పోయి నది. కాదంబరి చంద్రాపీడునిఁజూచి మోహపరవశయై శపథములు మరచి శృంగారలీలలు ప్రకటించినది. సందిగ్ధంబగు తద్భావముల గ్రహిం పక యొకనాఁడు మాత్రమేయుండి చంద్రాపీడుఁడు తనసేనానివేశమున కరిగెను. అమ్మరునాడు కిమ్పురుష పతని తీసికొనిరమ్మని కాదం

కేయూరకుఁడను తన వీణావాహకు నంపినది. ఆ వార్తవిని చంద్రాపీడుఁడు పత్రలేఖతోఁగూడ నమ్మరునాఁడు కాదంబరియొద్ద కరిగెను.

నాఁడుగూడ వారిభావములు సిగ్గుచే నొండొరులకుఁ దెల్లమైనవికావు పత్రలేఖ నందుంచి చంద్రాపీడుఁడు తనస్కంధావారమునకుఁ బోయెను. అప్పుడే తనతండ్రియొద్దనుంచి వచ్చినయుత్తరము జూచి తత్తరముతో మేఘనాధుఁడను సేనాధిపతి నందుండి పత్రిలేఖను వచ్చినతరువాతఁ దీసికొనిరమ్మనిచెప్పి కాదంబరికొక యుత్తరము వ్రాసియిచ్చి వైశంపాయనుని స్కంధావారముతో రమ్మని తానుజ్జయినికిం బోయెను.

తరువాతఁ బత్రలేఖయుఁ గేయూరకుఁడునువచ్చి చంద్రాపీడునకు గాదంబరి విరహాతురత్వ మెఱింగించిరి. ఆమె తన్నుగుఱించి పరితపించుచున్నదని విని చంద్రాపీడుఁ డిల్లు కదలు నుపాయ మాలోచించుచు వైశంపాయనుఁడు సేనలతో రాక యచ్ఛోద సరస్తీరమున విరక్తిఁ జెందియున్నాఁడను వార్తవిని ముందుగాఁ దనరాక కాదంబరికిఁ దెలియఁజేయుటకై పత్రలేఖను కేయూరకుని హేమకూటమున కనిపి తానుబోయి వైశంపాయనుని దీసికొని వత్తునని తండ్రి కెఱింగించి తదనుమతి బయలుదేరి తిన్నగా నచ్ఛోదసరస్సునకుఁబోయి యాప్రాంతముల నతని వెదకుచుఁ పిమ్మట మహాశ్వేతయొద్దకుఁ బోయెను.

మహాశ్వేత యతనిం జూచి దుఃఖించుచు వైశంపాయనుఁడు తన్నుఁ గామించి శప్తుండై మృతుం డయ్యెనని యాకథ యెఱింగించినది. ఆమాట వినినతోడనే చంద్రాపీడుఁడు ప్రాణములువిడిచి నేలం బడిపోయెను. అక్కడఁ గాదంబరియుఁ బత్రిలేఖచేఁ దెలుపఁబడి చక్కగా నలంకరించుకొని మహాశ్వేతాశ్రమమునకు వచ్చి చచ్చియున్న చంద్రాపీడునింజూచి దుఃఖించుచు మహాశ్వేతవలెనే యశరీరవాణిచే నూరడింపఁబడి తద్దేహ మర్చించుచుఁ గొంత కాలము గడిపినది.

పుండరీకునిచే శపింపఁబడి చంద్రుఁడు చంద్రాపీడుఁడై పుట్టెను. చంద్రాపీడుఁడు అట్లు ప్రాణములు విడిచి శూద్రకమహారాజై యుదయించి రాజ్యమేలుచుండెను. చంద్రునిచే శపింపఁబడిన పుండరీకుఁడు రెండవజన్మమునందు వైశంపాయనుఁడై మూఁడవజన్మమునందు మహాశ్వేతచే శపింపఁబడి చిలుకయై యుదయించి జాబాలి యను మహర్షి యాశ్రమమున జాతిస్మృతిగలిగి మహాశ్వేతయొద్దకుఁ బోవుచుండ నతనిదుర్వృత్తి వారించుటకై వానితల్లి లక్ష్మి మాతంగకన్యక రూపమున నెలసి యాచిలుకం బట్టి తెప్పించి యనుతాపము గలుగఁ జేసి శాపావసానమున శూద్రకునియొద్ద కా చిలుకను దీసికొనివచ్చి యప్పగించినది. ఆరాజు చిలుకవలనఁ దమపాత్రిక్తన జన్మకథయంతయు విని విరాళిఁజెందుచుఁ జిలుకతోఁగూడ నా దేహము విడిచెను. అక్కడఁ జంద్రాపీడుఁడు జీవించి లేచి కాదంబరిం గౌఁగలించుకొనియెను. పుండరీకుఁడును గపింజలుని కేలుపట్టుకొని మహాశ్వేతకడకు వచ్చెను. తరువాత మహాశ్వేతను బుండరీకుడును గాదంబరినిఁ జంద్రాపీడుడును బెండ్లియాడి దివ్యభోగము లనుభవించిరి. ఇదియే కథావిధానము. ఇందలి తప్పుల మన్నించి యొప్పుల గ్రహింప సజ్జనులు ప్రార్థితులు.

ఉ. రెండవ కూర్పునం దనుసరించి మదీయ తృతీయ జాయధీ
మండన రాజ్యలక్ష్మి యసమాన కథా విభవాభిరామమై
యుండిన దీని నిప్డు సమయోచిత రీతులఁ బెంపుసేయఁ బా
గుండు నటంచుఁ దెల్పె నుపయుక్తముగా నిది యట్లు చేసితిన్.

రాజమండ్రి, }
24-11-1922. }

ఇట్లు,
మధిర సుబ్బన్న దీక్షితకవి.

# మంగళాచరణము



చ. నిరతము లోకసంతతి జనింపఁగ వర్థిల ద్రుంగ హేతువై
నిరుపమనిత్యపూర్ణ శుభనిర్మల సచ్చిదనంతమూర్తియై
గురుతర యోగదూరుల కగోచరమై గుణరూపశూన్యమై
పరఁగెడు నాత్మతత్త్వమును భక్తి భజింతు నభేదబుద్ధితోన్.

సీ. ఆసించునే శక్తి యనుకంప జనియింపఁ
జతురాననాది నిర్జర గణంబు
గురునిష్ఠ నేదేవి చరణము ల్భజియించి
స్థిరకీర్తి వడసెఁ గౌశికమహర్షి
మూఁడుకన్నులు గల్గు మోము లైదైదు వ
న్నెలనొప్పునే మహనీయ రుచికి
దివ్యసాధనముల దీపించు నే యంబ
పదిచేతు లురువర ప్రదము లగుచు

విప్రజనముల పాలింటి వేల్పుగిడ్డి
రమణ నిరువదినాల్గువర్ణముల మనువు
మనుచు నద్దేవి యావేద మాత మాత
నభి నుతించెద గాయత్రి నాత్మ నెపుడు.

క. మోదం బలరఁగ నీ దగు
పాదంబుల నమ్మి భక్తి పరతంత్రుఁడనై
కాదంబరిఁ దెనిగింపం
గాఁ దొడఁగితి వేదమాతృకా ! ప్రోవఁగదే.

ఉ. చేసితి నీకృపారసవిశేషమునం గడు సారసత్కథా
భాసురముల్ ప్రబంధములు భవ్యవచోరచనా చమత్కృతిం
జేసి ననుం జనుల్ బొగడఁజేసితి నమ్మ భవత్పదాబ్జ సే
వా సుసమాహితాత్ము లిల వాసితకీర్తులు గారె మాతృకా!

శా. భవ్యాలంకరణోరు భావమృదుల వ్యంగార్థ సంయుక్తమై
దివ్యద్బాణకవి ప్రణీతమయి సందీపించు కాదంబరీ
కావ్యంబర్థముసేయఁ బండితులకుం గాదన్న చో నాకహా!
సువ్యక్తంబుగఁ దెల్గు సేయనగునే సూరుల్ విచారింపరే!

చ. గనిఁ గని సాధ్యరత్నములఁ గైకొనువాని విధంబునన్ ఫలిం
చిన మహీజంబుఁజేరి తనచేతుల కందినపండ్లఁ గోయు న
ట్లనుపమ శబ్ద వారినిధియై తగు దీన స్ఫురించి నంత గై
కొని తెలిగించితిన్ సదనుకూలకథాగతి దప్పకుండఁగన్.

చ. మృదుపద వాక్యవైభవ సమేతమునై సదలంకృతి ప్రభా
స్పదమగుచున్ శుభధ్వనుల భాసిలి కోమలభావ దీప్తమై
పొదలెడు నీకథారచన పూతగతిన్ సుజనాళికర్థ సం
పద పొలుపొంద మారమణి మాటికి ముదం బొనరింపకుండునే.

## కథా ప్రారంభము.

గీ. అవధరింపుము మణిసిద్ధ యతివరుండు
కాశి కేగుచు శిష్యయుక్తంబుగాఁగ
నెలమి ముప్పదియొకటవ నెలవునందు
దనయనుష్ఠానమును దీర్చుకొనినపిదప.

గోపాలుని రాక నరయుచున్నంతఁ గొంతసేపునకు వాఁ డరుదెంచి నమస్కరింపుచు స్వామీ! యీపీట మేటిదేవళము ప్రహరి గోడచుట్టును బెక్కుచరిత్రములు దెలుపు విగ్రహములు వ్రాయఁబడి యున్నవి. వాని నెల్లం దెలిసికొంటిని కాని యొకచోట శాటీపటముల ధరించిన నలువురు స్త్రీలు వ్రాయఁబడిరి. వారిలో నొకతె విగ్రహము నర్చించుచున్నట్లును నొకతె గుహాముఖమునం గూర్చుండి జపము జేసికొనుచున్నట్లును ఇరువు రూరక నిలువంబడియున్నట్లు వ్రాసిరి. ఆకథ యేమియో తెలిసినదికాదు. నేఁటికా యుదంత మెఱింగింపుఁడని కోరిన నప్పారికాంక్షి మణిమహిమ నత్తెరం గెఱింగి యిట్లు చెప్పఁ దొడంగెను.

## విషయ సూచిక



# కాశీమజిలీ కథలు

ఉత్తరఖండానుబంధము. 31 వ మజిలీ.

## కాదంబరి.



### శూద్రకమహారాజు కథ.



గీ. పుడమిఁగలిభయమునఁ బ్రోగుపడిన కృతయు
గంబనఁగ సర్వధర్మ ప్రకాశమగుచు
సారవేత్రవతీనదీతీరమందు
విదిశయను రాజధాని సంపదలఁబొదలు.

అప్పట్టణంబున కధినాయకుండై శూద్రకుండను రాజు సకల నృపశిరస్సంధానితశాసనుండై రెండవ పాకశాసనుండువోలె భూమండలమంతయు నేకాతపత్రముగఁ బాలించుచుండెను.

అన్నరవరుం డనవరతదానజలార్ద్రీకృతకరుండై దిగ్గజంబువోలెఁ బ్రతిదివసోపజాయమానోదయుండై ప్రభాకరుని చందమున నొప్పుచు సర్వశాస్త్రములకు దర్పణమనియుఁ గళల కుత్పత్తిస్థానమనియు సుగుణములకుఁ గులభవనమనియు మిత్రమండలమున కుదయశైలమనియు రసికులకాశ్రయుఁడనియు ధనుర్ధరులకుఁ బ్రత్యాదేశమనియుఁ బొగడ్త కెక్కెను.

మఱియు, దృఢముష్టినిష్పీడనంబునంబయలు వెడలిన జలధారయుంబోలె నాభూపాలు కేలంగ్రాలు కరవాలంబు కరికటతటగళిత మదజలాసారదుర్దినములగు సంగరసమయములయందు వీరభటకవచసహస్రాంధకార మధ్యవర్తినియైయున్న జయలక్ష్మి నభిసారికవోలెఁ బెక్కుసారులతనిచెంతకుఁ దీసికొనివచ్చినది.

అయ్యవనీపతి కువలయభరంబు వలయంబువోలె నవలీలనిజభుజాగ్రంబున భరించుచుఁ బలుమారు నీతిశాస్త్రములెల్ల నవలోకించి బుద్ధిబలముచే బృహస్పతి నైనంబరిహసించుచుఁ బ్రబుద్ధులనివాడుక జెందిన కులక్రమాగతులగు మంత్రులు సేవింప సమానవయోవిద్యావిభూషితులు ప్రేమానురక్తహృదయులు నసమసమరక్రీడాభిరతులు నగు రాజసుతులతోఁగూడికొని క్రీడించుచుఁ బ్రథమవయస్సు సుఖముగా వెళ్ళించెను.

సీ. అతులస్వరంబు లుప్పతిలంగ వీణగై
కొనిపాడు హాయిగాఁ గొంతసేపు
మహితప్రబంధనిర్మాణ క్రియాగత
స్వాంతుఁడై యలరారుఁ గొంతసేపు
దర్శనాగతతపోధనజనారాధనా
కుతుకాత్ముఁడై యుండుఁ గొంతసేపు
చర్చించు సకలశాస్త్రప్రసంగంబులఁ
గోవిదావళిఁగూడి కొంతసేపు
గీ. కోర్కెచిత్తరువులు వ్రాయుఁ గొంతసేపు
గురుపురాణము లాలించుఁ గొంతసేపు
జంతుసంతతినాడించుఁ గొంతసేపు
అంగనాభోగవిముఖుఁడై యనుదినంబు.

మిగుల సుందరుఁడగు నానృపనందనుండు ప్రథమవయస్సున స్త్రీజనమును దృణముగాఁ జూచుచు సంతానార్థులగు మంత్రులచే బోధింపఁబడియు సురతసుఖంబు నందలి విరోధంబునం బోలె దార సంగ్రహం బనుమతింపఁ డయ్యెను.

ఒకనాఁడు ప్రొద్దుట నప్పుడమిఱేఁడాస్థానమంటప మలంకరించి యున్న సమయంబున నంగనాజనవిరుద్ధముగ వామకక్షమునఁ గొక్షే యకమిడికొని సన్నిహితపన్నగం బగు చందనలతవోలె భీషణరమ ణీయమగు నాకారముతో బ్రతీహారి యరుదెంచి జానుకరకమలంబులు పుడమిసోక మ్రొక్కుచు నిట్లనియె.

దేవా ! కుపితుండగు దేవేంద్రుని హుంకారంబున నేలంబడిన త్రిశంకుని రాజ్యలక్ష్మియోయన దక్షిణదేశమునుండి మాతంగకన్యక యొా ర్తు పంజరముతో నొకచిలుకను దీసికొనివచ్చి ద్వారదేశమునఁ నిలువంబడి దేవరతో నిట్లు విజ్ఞాపన చేయుచున్నది. భువనతలంబున గల రత్నములకెల్లఁ గల్లోలినీ వల్లభుండువోలె దేవరయే యేకభాజన మని తలంచి యాశ్చర్యభూతమగు నీవిహంగమరత్నము నేలికపాద మూలమును జేర్చు తలంపుతో నరుదెంచితిని. దర్శనసుఖంబనుభ వింపఁగోరుచున్నదాన.

అని తత్సందేశ మెఱింగించిన ప్రతిహారి వచనంబులు విని యాభూనేత కుతూహలోపేతుఁడై యాసన్నవర్తులగు మిత్రులమోము లుపలక్షించుచు దీనందప్పేమియున్నది, ప్రవేశపెట్టుడని యాజ్ఞాపిం చుటయు నాప్రతీహారి సత్వరమ యఱిగి యమ్మాతంగ కుమారిం దీసి కొని వచ్చినది.

ముదిమిచేఁ బండిన శిరముగలిగి నేత్రకోణము లెఱ్ఱని జీరలతో నొప్పుచుండ జవ్వనముడిగినను బరిశ్రమ గలుగుటచే శిథిలముఁ గాని మేని బింకముతోఁ దెల్లనివస్త్రములు ధరించి వృద్ధమాతంగుఁ డొకఁడు

ముందు నడుచుచుండఁ బైడిశలాకలచే రచింపఁబడినను జిలుక రెక్కల కాంతులచే మరకతమయమైనది పోలెఁ బచ్చవడియున్న పంజరమును జేతంబూని కాకపక్షంబులు చలింప నొక చండాల బాలకుఁడు తోడరా నసురాపహృతంబగు నమృతంబు వేల్పులకిడ నవధరించిన మధుసూదనుని మోహినీరూపమును బురడించుచు మీగాళ్లదనుక మేలిముసుగు వైచికొనుటచే సంచరించు నింద్రనీలపుబొమ్మవలెనొప్పుచు సంతతము వెన్నుని యురమందు వసించుటఁ దదీయశ్యామప్రభాసంక్రమణంబున నల్లబడిన మహాలక్ష్మియుంబోలె బలరాముని హలాపకర్షణ భయంబునఁ బారివచ్చిన యమున చాడ్పునఁ గుపితహరనయన దహ్యమానుండగు మదనుని ధూమమున మలినీకృతయగు రతిననుకరించుచు నచిరోపారూఢ యౌవనయై వచ్చుచున్న యామాతంగ కన్యక నిమిషలోచనుండై యారాజమహేంద్రు డీక్షించి విస్మయావేశితహృదయుఁడై యిట్లు తలంచెను.

అన్నన్నా! తగనిచోట హాటకగర్భున కక్కజమగు రూపు గల్పించు ప్రయత్న మేమిటికిఁ గలుగవలయును. అక్కటా! నిరతిశయసౌందర్యవిశేషంబునం బొలుపొందు నియ్యిందువదనను ముట్టరాని నికృష్టకులంబునం బుట్టించెఁగదా? మాతంగజాతిస్పర్శభయంబున స్రష్ట ముట్టకయే యిప్పూఁబోఁణిని నిర్మించెనని తలంచెదను. కానిచోఁ దదీయకరతలస్పర్శక్లేశితములగు నంగముల కింత వింత కాంతియు లావణ్యము గలిగియుండునా? ఇసిరో! సరసిజభవుండెప్పుడు నసదృశసంయోగమునే చేయుచుండును గదా? అతిమనోహరాకృతిగల యీనాతి క్రూరజాతియందుదయించుటచే నిందిత సురతరువై యసుర సంపదవలె నభోగ్యమైయున్నదని నాడెందము మిక్కిలి పరితాపము జెందుచున్నది.

అనియతండు తలంచుచుండ నక్కన్యారత్నము మ్రోలకువచ్చి

యించుకవంగి ప్రోడవలె నమస్కరించి యమ్మణికుట్టిమంబుననోరగా గూరుచున్నంత నావృద్ధ మాతంగుండు పంజరములోనుండగనే చిలుకను చేతితోనంటి సవరించుచు గొంచెము దాపునకునచ్చి జేనికిం జూపుచు నిట్లనియె. దేవా! యీ చిలుక సకలశాస్త్రార్థములు గుర్తెఱుంగును. రాజనీతియందును పురాణకథాలాపమునందును దీనికి మంచి నైపుణ్యముగలదు. కావ్యనాటకాలంకార గ్రంథములు జదువుటయే కాక స్వయముగా రచింపఁగలదు. వీణావేణుమురజప్రభృతి వాద్యవిశేషముల సారమిదియే చెప్పవలయును. చిత్రకర్మయందు ద్యూతవ్యాపారమునందును గజతురగ స్త్రీలక్షణ జ్ఞానమందును దీనిని మించినవారు లేరు. ప్రణయకలహాకుపితులగు కాముకులం దేర్చు నేర్పు దీనికే కలదు. పెక్కులేల? యూపతత్రిప్రవరంబు సకలభూతల రత్నభూతమని చెప్పనొప్పును. దీనిపేరు వైశంపాయనము. సర్వరత్నములకు జలనిధి వోలె దేవర ముఖ్యభాజనమనితలంచి మా భర్తృదారిక యీచిలుకను మీపాదమూలమునకుఁ దీసికొని వచ్చినది. దీనిం దయతోఁ బరిగ్రహింపుఁ డని పలుకుచు నాపంజర మానృపకుంజరుని ముందర నిడి యావృద్ధుం డించుక యెడముగాఁ బోయెను.

అప్పు డప్పతంగ పుంగవము రాజాభిముఖముగా నిలువంబడి కుడిచరణమెత్తి మిక్కిలి స్పష్టములగు వర్ణస్వరములచే సంస్కరింపఁబడిన వాక్కులతో జయశబ్దపూర్వకముగా నీపద్యముఁ జదివినది.

గీ. అనఘ! భవదరి నృపవధూస్తన యుగంబు
చిత్తగత శోకదహనంబు చెంత నిలిచి
యశ్రుజలపూరమునఁ దీర్థమాడి మరి వి
గతమహా హారమైౖ వ్రతిస్థితిదనర్చు.

ఆచిలుక పలుకులు విని యానృపతిలకుండు వెఱఁగు జెందుచు

శ్లో॥ స్తనయుగమశ్రుస్నాతం సమీపతరవర్తిహృదయశోకాగ్నే!

సంతసముతోఁ జెంతనున్న కుమారపాలితుం డను వృద్ధమంత్రింజూచి ఆర్యా! యీచిలుక పలుకులయందలి స్పష్టతయు మాధుర్యమును వింటివా? ఇది వర్ణమాత్రానుస్వారస్వర సంకరము గాకుండ నభివ్యక్తముగాఁ బలుకుటయే మొదటిఁ జిత్రము. మఱియు మనుజుండు వోలె బుద్ధిపూర్వకమగు ప్రవృత్తితో నభిమతవిషయమై కుడిచరణమెత్తి జయశబ్దపూర్వకముగా నతిపరిస్ఫుటాక్షరముగా పద్యము జదువుటఁ గడుంగడు నబ్బురము గలుగఁజేయుచున్నది. తరుచు పక్షులును, బశువులును నిద్రాహారమైథునభయసంజ్ఞామాత్రవేదులు గదా?

అని పలుకుటయు గుమారపాలితుఁ డించుక నవ్వుచు దేవా! ఇది యేమిచిత్రము. శుకశారికాప్రభృతి విహంగమ విశేషములు మనుష్యులచేఁ జెప్పబడిన మాటలం బల్కుచుండుట దేవర యెఱుంగనిదియా? పూర్వము చిలుకలు మనుజులువలె బలుకుచుండునవి. అగ్నిశాపంబునం జేసి శుకవచనము లపరిస్ఫుటములైనవి.

అని యతండు సమాధానము జెప్పుచుండఁగనే చండకిరణుం డంబరతల మధ్యవర్తి యయ్యెనని తెలుపు భేరీనినాదముతోఁ గూడ మాధ్యాహ్నిక శంఖధ్వని బయలు వెడలినది.

ఆధ్వని విని యమ్మహారాజు స్నానసమయమయ్యెనని తటాలున సింహాసనమునుండి లేచి రాజలోకమెల్ల సంభ్రమోత్సేకముతో గద్దియలు విడిచి వినయవినమితోత్తమాంగులై నిలువంబడిన శిరఃకంపమున వారికిఁ బోవుట కనుజ్ఞ నిచ్చుచు నచ్చండాల కన్యకతో మేము వచ్చువఱకు నిందుండు మని నియమించి యచ్చిలుకను లోపలకుఁ దీసికొనిపోయి స్నానపానాశనాదివిధులం దీర్పుమని తాంబూలకరండవాహినికిం జెప్పి సముచిత మిత్రలోకము సేవింప నభ్యంతరమందిరమున కరిగెను.

అందు స్నానసంధ్యావందన దేవపూజాది నిత్యక్రియాకలాపములు నిర్వర్తించుకొని రాజబంధువులతోఁగూడ నభిమతరసాస్వాదంబున బ్రీతుండగుచు భోజనముగావించి ప్రతీహారిమార్గ మెఱింగింప మనోహరాలంకారమండితంబైన విశ్రమమంటపమునకుఁ బోయి శయనతలంబునఁ గూర్చుండి తాంబూలము వైచికొనుచు నాప్తవర్గంబు చుట్టునుం బరివేష్టించి వినోదకథలచే చిత్తము రంజింపఁజేయుచుండ నిండు వేడుకలతోనుండి యాభూమండలాఖండలుఁడు వైశంపాయనపును దీసికొనిరమ్మని ప్రతిహారి కాజ్ఞాపించుటయు నదిపోయి యత్యంత శీఘ్రముగా నాచిలుక పంజరము దెచ్చి రాజుముందిడి, అప్పుడా భూపతి చిలుకంజూచి పతంగపుంగవా! అభిమతభోజనంబున దృప్తుండవైతివే? యని యడిగిన నది దేవా! సమదకోకిలలోచనరుచిం బురడించు జంబూఫలంబు లెన్నేని యాస్వాదించితిని. హరినఖరభిన్న మాతంగకుంభార్ద్రింబులగు ముక్తాఫలంబులం బోలిన దాడిమీబీజంబుల రుచి యేమనవచ్చును? అన్ననా! నళినీదళంబులు వోలె హరితములగు ద్రాక్షఫలముల మాధుర్య మెప్పటికైన మరువవచ్చునా? అయ్యారే! ప్రాచీనములగు నుసిరికకాయల పస యనుభవించి తీరవలయును. పెక్కేల భవదంతఃపురకాంతలు స్వయముగాఁ గరతలములచే నాకుఁ దినిపించినవన్నియు నమృతాయమానంబులై యున్నవని పెద్దగాఁ బొగడెను.

ఆమాట లాక్షేపించుచు నాక్షితిపతి పక్షీంద్రమా! యది యట్లుండనిమ్ము. నీవే దేశమునం జనించితివి? నీ తలిదండ్రు లెవ్వరు? నీకు వేదశాస్త్రపరిచయ మెట్లుకలిగినది? ఇతరవిద్యావిశేషము లెట్లు గ్రహించితివి? జన్మాంతరానుస్మరణమా! లేక వరప్రదానమా? అదియునుంగాక శుకరూపము దాల్చి ప్రచ్ఛన్నముగాఁ దిరుగుచున్న యొకానొక దివ్యుఁడవా? నీకెన్ని యేండ్లున్నవి? యింతకు ముందు

సి వెందుంటివి ?

నీకీ పంజరబంధము చండాలకన్యకాహ స్తప్రా ప్తియు నెట్లు కలి గినది. నీవృత్తాంతము విన మిక్కిలి కుతూహల మగుచున్నది. యె ఱింగించెదవే యని యడిగిన నాచిలుక పర్వతమాత్మగతంబున నించుక ధ్యానించి యిట్లనియె.



# చి లు క క థ.



దేవా ! నాయుదంతము కడు పెద్దది. వినుటకు దేవర కిష్ట మేని వక్కాణించెద నాకర్ణింపుఁడు. వింధ్యారణ్యాంతర్భాగం బగు దండకారణ్యమునఁ బ్రసిద్ధి జెందియున్న పంచవటీతీరమున కనతిదూర ములోనున్న పంపాసరోవరము పశ్చిమభాగంబున శ్రీరామశరప్రభం జితములగు సప్తతాళముల ప్రక్క నొక్క వృద్ధశాల్మలీ వృక్షము గలదు.

అత్తరువరంబు మూలంబు దిక్కరి కరరుబలంబోని జరదజగరం బుచేఁ జుట్టుకొనఁబడి యాలవాలము గట్టఁబడినట్లొప్పుచు శాఖా సమూహములచేఁ దిగంతముల నావరించి విలయవేళాతాండవ ప్రసా రిత భుజుండగు శంకరు ననుకరించుచు సాగరజలంబులం గ్రోలి యిటు నటు సంచరించుచుఁ బక్షులవలె శాఖాంతరములయం దడఁగియున్న మేఘంబులచేతఁ గూడ నావరింపబడని యగ్రభాగముగలదై రవితురం గముల కవరోధము గలుగఁజేయుటచే నలయిక జెందిన యవ్వారు వంబుల ముఖములనుండి వెల్వడు ఫేనపుంజమో యనఁబడు సితతూ లికామాలికలచే నగ్రశాఖలు ప్రకాశింప నాకల్పస్థాయియగు నున్నత స్కంధముతో నొప్పుచు నబ్బాబురగు మేరువువలెఁ బ్రఖ్యాతిఁజెంది యున్నది.

మఱియు న_త్తరువు విస్రబ్ధముగా జనులకారోహింపశక్యము కాని దగుట ఘాతుకులవలనఁ దమ కపాయము రాదని తలంచి శాఖాంతరములయందునుఁ గోటరోదరములయందునుఁ బల్లవాంతరముల యందును జీర్ణవల్కల వివరములయందును మిగుల నవకాశము గలిగి యుండుటచేత నానాదేశముల నుండి వచ్చి శుకసంతతులు గూడులు కట్టుకొని హాయిగా సుఖించుచున్నయవి.

అందొక జీర్ణకోటరమందు జాతిపులుగులతోపాటు కులాయము నిర్మించుకొని భార్యతోఁ గూడ మాతండ్రి చిరకాలము సుఖించెను. విధివశంబున నతనికి ముదిమియందు నేనొక్కరుండ పుత్త్రుండ నుద యించితిని. నేను బుట్టిన యాక్షణమునందే యతిప్రబలమగు ప్రసవ రోగంబున మా తల్లి పరలోకమున కతిథిగా నఱిగినది.

అభిమతజాయావినాశ శోకంబున స్రుక్కు చుండియు మా తండ్రి సుతస్నేహంబున నాశోక మడచికొని తానొక్కరుండ యే కొరంతయు రానీయకుండ నన్నుఁ బెనుచుచుండెను.

నా తండ్రి మిగుల వృద్ధుడగుట శిథిలములగు రెక్కలతో నెగర లేక వణకుచు స్రుక్కినముక్కు కొనచేత ఫలములజీర నశక్తుండై పర నీడములక్రింద నక్కడక్కడ జారిపడిన ఫలశకలంబులును తండుల కణంబులునుదెచ్చి నాకిచ్చుచు మద్భుక్తావశిష్టములచేఁ దాను సైతఁ మాకలియడంచుకొనుచుఁ గొన్నిదినములు గడిపెను.

ఇట్లుండ నొకనాఁడు ప్రాతఃకాలమున లేతయెండచే వనతరు శిఖరపల్లవంబులు వింతకాంతిఁ బ్రకాశింపుచుండ గొన్నిచిలుకలు మేతకై దిక్కుల కరుగ మఱికొన్ని పిల్లలతోఁగూడ గూడులయం దణఁగి యుండ నిశ్శబ్దంబున నవ్వనస్పతి శూన్యమైనదివోలె నొప్పుచుండెను.

అప్పుడు నా తండ్రియు నన్ను రెక్కలలోఁ బెట్టుకొని ముద్దాడు చుండ నేనును బాల్యంబున నెగురుటకు రెక్కలురామిం జేసి యతని

యక్కులోఁ జిక్కి మిక్కిలిసంతోషముతో నుంటిని. అట్టిసమయమున నవ్వనమందు నాకస్మికముగా గుహాసుప్తంబులగు మృగేంద్రంబులు దద్దరిల్ల వనచరంబులుపరవ వరాహంబులార్వ శార్దూలాది క్రూర మృగసమూహంబు వెరవునంబార గంగాప్రవాహంబు ననుకరించుచు

సీ. ఇటు రండు గజములిచ్చటనుండు తుండవి
ధ్వస్తషండేజ గంధంబు వెడలె
నిందుఁ దప్పక వసియించుఁ గ్రోడములవి
నములుముస్తల వాసనలు గడంగె
వనమహిషంబులవ్వలనుండు, ఱేఁగెగో
మ్ముల౯ జిమ్ము వల్మీకముల రజంబు
కరికలభంబు లక్కడఁ గూడు, సల్లకీ
రసకషాయామోదమెసఁగ నెసఁగె.

గీ. రుధిరపాటల కరికుంభ రుచిర మౌక్తి
కాంచితాంబీపదంబు లిందలరు సింహ
గణములవె చూడుఁడభినవఘాసకబళ
హరిణరోమంథ ఫేనసంహతులుదోఁచె.

చ. ఇదె చమరీమృగాళి వసియించెడు తావిట నాభివాసనల్
బొదలెడుఁ బారుచున్నవవె మూకలుగా మెకముల్ సమంబుగా
వదలుఁడు వేటకుక్కలను భద్రమువింట శరంబుగూర్చుఁడ
ల్లదె మెక మేదియో చనె రయంబునఁ గొట్టుఁడు పట్టుడుద్ధతి౯.

అని యొండొరులతోఁ బలుకుచున్న వేటకాండ్ర ఘోషఘోషంబు వినంబడినది.

అశ్రుతపూర్వమగు నారొద విని నేను బాలుండనగుట చెవులు చీటులువార భయముచేత మేను గడగడవడంక వివశత్వమునొంది

సమీపమునందున్న తండ్రియొక్క జరాశిథిలములగు రెక్కలసందున దూరితిని.

అప్పుడా యరణ్యమంతయుఁ బారుచున్న క్రూరసత్వముల యార్పులచే నల్లకల్లోలమైనది. మఱికొంతసేపునకా రొదయంతయు నణఁగి యయ్యడవి కల్లోలశూన్యమగు సాగరములాగున నిశ్శబ్దమై యొప్పినది.

అట్టిసమయమున నేను శైశవచాపలంబునంజేసి యదియేమియో యని మాతండ్రి రెక్కలసందునుండి బైటికివచ్చి కంఠముచాచి భీతిచే గదలుచున్న తారకలతో యారొదవచ్చినదెసకే దృష్టిబరికించితిని.

అప్పుడావంకనుండి కార్తవీర్యార్జున భయంబున బారి వచ్చుచున్న నర్మదానది పగిది జంఝామారుతవికీర్ణమగు తమాలకాననము వడువున నేకీభూతమగు కాళరాత్రిసంఘూతముభాతి సూర్యకిరణాకులమైన యంధకారము తీరున నయ్యరణ్యమంతయుఃజీకటిఁగలుగఁ జేయుచు ననేకసంఖ్యాకమగు శరబసైన్యము నా కభిముఖముగా వచ్చుచుండఁ జూచితిని.

ఆసైన్యమధ్యంబున నుక్కుచే రచియింపంబడినవో యనునట్లు కర్కశములగు నవయవములు గలిగి శ్యామలదేహ ప్రభాప్రవాహంబున నయ్యడవి యంతయు నిండింపుచు నెఱ్ఱని దృష్టులు వింధ్యశిలాతల విశాలంబగు నురంబును మెఱయ స్థూలవరాటికా మాలికలచే నలంకరింపంబడి పతులం జంపవలదని తన్నుఁ బ్రతిమాలికొనవచ్చిన యేఁడు సింగంబులో యనఁ గౌలేయకుటుంబినులనుసరించి రాఁ జమరీ వాలంబులు గజదంతంబులు కరిగండముక్తాఫలంబులు మయూర పింఛంబులు పిసితాహారంబులు గైకొని శబరపరిజనులు వెంట నడువఁగృతాంతుని యంశావతారమన మహామోహిని సోదరునివలె నొప్పుచుఁ బ్రథమవయసుననున్న మాతంగుడను పుళిందనాథుం

గాంచితిని. వారాడుకొనుమాటలు వినుటచే వానిపేరు మాతంగుఁ డని యెఱింగితిని.

ఆహా! వీని జీవితము మోహప్రాయము. చరితము సాధుజన గర్హితము. ఆహారము మద్యమాంసాదికము. పరిశ్రమయంతయు జీవ హింసయందఁ ద్రాగుటయే యుత్సవము. చెరబట్టిన యుత్తమస్త్రీలే కళత్రములు. మృగములతో సహవాసము. పశురక్తంబున దేవతార్చనము. మాంసమున బలికర్మ. ఇట్టి వీనికిఁ గరుణ యెట్లు కలుగును. శాంతి పేరైనం దెలియునా? క్షమ కెంతదూరము. వీనికి వివేకమెన్నఁడైనఁ గలుగునేమో అని నే నాలోచించుచుండఁగనే యమ్మాతంగుఁ డరణ్యసంచార పరిశ్రమనపనయించుకొనుటకై యా బూరుగు నీడ కరుదెంచి కోదండ మెక్కుడించి పరిజనోపనీతంబగు పల్లవాసనంబునఁ గూరుచుండెను.

అప్పుడు శబరయువకుఁ డొకండు వడివడి నాసరోవరంబున కరిగి చేతులతో జలంబుపై నున్న మలినంబు విడఁద్రోయుచుఁ గమలినీపత్రపుటంబున నీరు పట్టి బిసతంతువులఁ గొన్నిటి కోసికొనివచ్చి యాయేలిక కర్పించెను. వాఁడాజలంబులం గ్రోలి చంద్రకిరణంబులం గ్రసియించు రాహువువలెఁ దామరతూడుల నమలి క్షుత్పిపాసల నపనయించుకొనియెను. వాఁడట్లు మాచెట్టునీడఁ గొంతసేపు విశ్రమించి పిమ్మటఁ బుళిందసేనాపరివృతుండై యెందేనిం బోయెను.

వారిలో నొక్కవృద్ధపుళిందుఁడు తినుటకు మాంసమబ్బమింజేసి యాఁకలిగొని వారితోఁబోవక యత్తరుమూలమున ముహూర్తకాలము జాగుజేసి మా యాయువులఁ గ్రోలువాడువలె నెఱ్ఱనిగుడ్లుగల దృష్టులతో నా వృక్షమెక్క నిశ్చయించి యా మూలచూడముగాఁ దల పైకెత్తి చూచెను.

ఆ చూపు వలననే శుకకులముల ప్రాణముల కుత్క్రాంత

సమయమైనది, కటకటా, అక్కటికములేని వారికిఁ జేయరాని కృత్యము లుండునా? అనేకతాళోచ్ఛ్రాయముగల యాపాదపమును సోపానములు గలదానివలె సులభముగానెక్కి యెగిరీయెగరని పిల్లలను, ఎగరనున్న నిసువులను, గొన్నిదినములక్రిందటఁ బుట్టినపిట్టలను, రెక్కలువచ్చుచున్న కూనలను శాల్మలీకుసుమ శంకాజనకములగు పోతముల నరసి యరసి శాఖాసందులనుండియు, కోటరములనుండియు, వేరు వేరు ఫలములను వలె పెక్కురకముల శుకశాబకముల గ్రహించి ప్రాణములను పోగొట్టి నేలం బడవైచుచుండెను.

అప్పుడు మాతండ్రియు నకాండమునఁ దటస్థించిన యప్రతీకారము ప్రాణహారము నగు నుపద్రవమునుజూచి మరణభయంబున మేను గంపమునొంద నుద్భ్రాంతదృష్టులతో నలుమూలలు సూచుచుఁ దాలువులెండ నన్నురక్షించు నుపాయంబుగానక తన రెక్కలసందున నిముడ్చుకొని గతర్వ్యతామూఢుఁడై ముక్కుగరచుకొనియుండెను.

పిమ్మట నప్పాపాత్ముఁడు క్రమమ్మునఁ గొమ్మలపై కెక్కి మేమున్న తొఱ్ఱలో యమదండమునుంబోలు తన బాహుదండమును జొనిపి సారెకు ముక్కుకొనచేఁ గరచుచు నరచుచున్న మాతండ్రిని గట్టిగఁ బట్టి పైకిఁదీసి గొంతువునులిమి ప్రాణములుబోఁగొట్టెను.

మిగుల నల్పదేహాము గలిగి భయముచేఁ దండ్రిరెక్కలసందున నడఁగియున్న నన్ను వాఁడాయుశ్శేషముగలుగఁబట్టి బరిశీలింపడయ్యెను.

ప్రాణములువిడచి తలవ్రాలవైచిన నా తండ్రిని యా నిర్దయుండు అధోముఖముగా నేలంబడవిడచెను. నేనును మాతండ్రితోఁ గూడ నేలంబడితినికాని దైవవశంబున జేసీ రాశిగానున్న యాకులపై బడుటచే నా కింతయేని యాయాసము గలిగినదికాదు.

అక్కిరాతుండు చెట్టుదిగకమున్న నేను బాలుండ నగుట దండ్రి చావుగణింపక ప్రాణపరిత్యాగ యోగ్యమగు కాలంబున నైత

మించుక తెక్కలు విదళించుచుఁ గొంచెము కొంచెమెగిరి కృతాంత ముఖకుహరమునుండి వెల్వడినట్లు నాతిదూరములోనున్న యొకతమాల విటపింగాంచిదట్టమైన యాచెట్టు మొదలుచేరి పక్షసవర్ణములగు పర్ణ ములసందున డాగియుంటిని.

అక్కిరాతుఁడు క్రమముగా నా చెట్టునంగల పిట్టలనెల్లఁబట్టి చెట్టుదిగి యసువులూడి క్రిందఁబడియున్న చిలుక సిసువులను జిక్క ములోఁ బెట్టుకొని మాతంగుఁడఱిగిన తెరవుబట్టి యతివేగముగాఁ బోయెను.

తరువాత నేనించుక తలయెత్తిచూచుచు నాకుకదలినను వాఁడే వచ్చుచున్నవాఁడని బెదరుచు పితృమరణశోక ఖిన్నుఁడనై మిగుల దాహమగుచుండు నీరుండతావరయుచు నామూలమునుండి యెగర దొడంగితిని. తెక్కలతోనెగరలేక పాదములతో నడచుచు నభ్యా సంబునం జేసి యడుగడుగునకు నేలఁబడుచు నెగరబోయి యడ్డముగా బడి యొంటితెక్కతో నానుచు నొగర్చుచు మేనెల్లధూళిగాఁగఁ నిట్లా యాసముతోఁ గొంచెముదూరమైనను నడువలేక మిక్కిలి దాహము వేధింప మనంబున నిట్లుతలంచితిని.

ఆహా! అతికష్టములైన యవస్థలయందుగూడఁ బ్రాణులకు జీవి తమందు నిరపేక్షిత్వము గలుగదు కదా? జంతువులకు జీవితముకన్న నభిమతమైన వస్తువు వేరొండు లేదు. నాయందు మిగులనను రాగముగల తండ్రి పరలోకగతుండైనను నాకు జీవితాశ వదలకున్నది. కటకటా! నాహృదయమెంత కఠినమైనదో? అతండు నాతల్లిపోయినది మొదలు సకల క్లేశములుపడి నన్నుఁబెనిచెనే? అట్టివాని ప్రేముడియంతయు గడి యలో మరచిపోయితిని. నా ప్రాణము లెంత కృపణములో? ఉప కారము జేసిన తండ్రి ననుగమించినవికావు. ఇట్టి సమయములో నైతేమొక్కనన్ను జలాభిలాష బాధింపుచున్నయది. పితృమరణమును

లెక్క సేయని పాతకమునన్నిట్లు బాధింపుచున్నది కాబోలు అయ్యో! జలములు దాపునలేవు. నాలుక యెండిపోవుచున్నది. నడువలేను. వనభూమియంతయు నాతపముచేఁ దప్తమైయున్నది. దాహమునకు నిమిషము తాళజాలను. చూపులకుం జీకటిగ్రమ్ముచున్నది. కట కటా! విధియెంతఖలుఁడో నాకు వేగము మరణమైనను గలుగఁజేయఁ డున్నాఁడని యనేకప్రకారములఁ దలపోయుచుంటిని.

ఆ ప్రాంతమందు జాబాలియను మహర్షి యాశ్రమముగలదు. అతనికుమారుఁడు హారీతకుండనువాఁడు. సకలవిద్యాపారంగతుండు. సవయస్కులగు మునికుమారులతోఁ గూడుకొని రెండవమార్తాండుని వలె దపస్తేజంబున వెలుంగుచు నమ్మార్గంబున స్నానార్థమై పంపా సరస్సునకుఁ బోవుచు దాహపీడితుఁడనై నోరుతెరచుకొని దారిలో నొగర్చుఁచుఁ బడియున్న నన్నుఁజూచెను.

సత్పురుషుల హృదయములు కరుణాబంధురములు గదా! అట్టి యవస్థతోనున్న నన్నుఁజూచి యమ్మహాత్ముం డంతరంగంబునఁ బరి తపించుచుఁ దోడిమునికుమారునితో వయస్యా! అటు చూడుము, ఆ శుకపోతము అజాతపత్రమై తలవాలవైచుకొని యున్నది. శ్యేనాది కము దీనిం బాధింపఁబోలు. దీని ప్రాణములు కంఠగతములై యున్నవి. నీటికొఱకుఁగాబోలు మాటిమాటికి నొగర్చుచు నోరుదెరచుచున్నది. పాపము దీని ప్రాణములు వాయకమున్న జలప్రదేశమును జేర్పుదము లెమ్ము. దీని ప్రాణములు కాపాడిన కడుపుణ్యము రాగలదని పలు కుచు మెల్లన నన్ను మృదులమగు హస్తములతోఁ బట్టికొని యా సరస్తీరము జేర్చి దండకమండలము లోకచోటం బెట్టి యతి ప్రయ త్నముతో ముక్తాఫలంబులంబోని జలబిందువులఁ గొన్నిటి నా నోటం బోసెను.

అప్పుడు నామేనంతయుఁ జల్లబడినది. పోయిన ప్రాణములు

తిరిగివచ్చినవి. శరీరమున దారుఢ్యము గలిగినది. పిమ్మట నన్నొక చెట్టునీడ నిలిపి తాను స్నానము గావించి నిర్వర్తితనిత్యక్రియాకలాపుండై యమ్మునికుమారుండు మిత్రవర్గముతో జలమువెడలి నన్నొక చేత బట్టికొని తన యాశ్రమమునకుం బోయెను.

అధికమహిమాస్పదంబగు నయ్యాశ్రమమున గురుతరయోగనిష్ఠాగరిష్ఠుండై యున్న జాబాలిం జూచి నేనంతర్గతంబున నిట్లుతలంచితిని.

ఆహా తపఃప్రభావము! ఈమునిమార్తాండుని యాకారము శాంతమయ్యు మెఱపుతీగెయుంబోలెం జూట్కులకు మిరుమిట్లు గొలుపుచున్నయది. ఇమ్మహర్షి యుదాసీనుండైనను ప్రభావసంపన్నుఁడగుట మొదటఁజూచినవానికి వెఱపుగలుగకమానదు. మహాత్ముల నామము స్మరించినంత నెట్టిపాపములైనం బోవుననుచో దర్శనమునవచ్చు సుకృతము మాట జెప్పనేల? సకలవిద్యలు నీ మహర్షిముఖమున నటించుచున్నయవి. అన్ననా? ఈముదిమి కెంత భయములేదో యీ మహానుభావుని జటాకలాపమును సైతము తెలుపుజేసినది. తేజశ్శాలులలో నీతండగ్రేసరుఁడు. ఈ ముని కుంజరుఁడు కరుణారసప్రవాహము. సంసార సముద్రమునకు సేతువు, సంతోషామృతసారము, శాస్త్ర రత్నములకు నికషపాషాణము, ఈ పుణ్యాత్ముని తపోమహిమచేతఁ గదా! మృగములిందు జాతివైరముమాని సంచరింపుచున్నవి. అయ్యారే? మహాత్ముల ప్రభావము ఎంతవిచిత్రమైనది. అని పెక్కు భంగుల నతని మహిమ నభినుతించుచున్న సమయంబున నన్నా హారీతకుఁడు రక్తాశోకతరు మూలమునకుం దీసికొనిపోయి యొకచోట నిలిపి తండ్రికి నమస్కరించి తానొక మూలఁ గూర్చుండెను.

అప్పు డచ్చటనున్న మునులు నన్నుఁజూచి [illegible] నెచ్చటనుండి తెచ్చితివని హారీతకు నడిగిన నతం[illegible]

నేను స్నానార్థమై పద్మసరస్సునకుఁ బోవుచుండఁగా దారిలో నొక చెట్టుక్రిందఁ నెండతాపమున వాడి, దుమ్ములో నోరు దెఱచుకొని యొగర్చుచు నీ శుకపోతము నాకుఁ గనంబడినది.

అప్పుడు నాకు దయపుట్టి దీనిని సరస్సునకుఁ దీసికొనిపోయి తోయము ద్రాగించి సేదదీరినంత నిచ్చటికిఁ దీసికొనివచ్చితిని. ఱెక్కలు వచ్చువఱకు నిందొక తరుకోటరమున నిడి, నీవారకణ నికరముల చేతను వివిధఫలరసములచేతను నేనును నీ మునికుమారులును దీనిం బోషించువారము. ఱెక్కలువచ్చిన తక్షణము గగనతలమున కెగిరి యిష్టము వచ్చిన చోటికిఁ బోవునది. ఇదియే నా యభిప్రాయమని పలికిన విని జాబాలి యించుక వేడుకతోఁ దలయెత్తి పుణ్యాజలముల చేతఁ బవిత్రముచేయువాడుంబలె నిర్మలమైన దృష్టులచే నన్నుప లక్షించుచు సారెసారెకు సాభిప్రాయముగా వితర్కించి నన్నుఁజూచి తలయూచి తానుఁ జేసికొన్న యవినయమునకు ఫలం బనుభవించుచున్నాఁడని పలికెను.

తపఃప్రభావసంపన్నంబగు దివ్యదృష్టిచేత సకల ప్రపంచమునం గల కాలత్రయ విశేషములు కరతలామలకముగాఁ జూడనోపిన యమ్మహానుభావుఁ డట్లుపలికినతోడనే యందున్న మునులందరు వెరగుపడి మహాత్మా! ఇది పూర్వజన్మమందెవ్వరు? ఎట్టియవినయ కృత్యము జేసి యిట్టిజన్మమెత్తినది? దీనిపేరేమి? ఈ వృత్తాంతము వినుటకు మాకు మిగులఁ గుతూహలముగా నున్నది. వివరింపవే యని ప్రార్థించిన నతండు మునులారా! దీని చరిత్రము కడువింతైనది. మనకు స్నానసమయమగుచున్నది. మీరును నిత్యానుష్ఠానములు దీర్చుకొని ఫలహారములఁ దృప్తులై రండు. రాత్రి సావకాశముగా నుడివెదనని పలుకగా వారందరు సంతసించి వడిగాఁబోయి కాల్యకరణీయములం దీర్చుకొని తత్కథాశ్రవణకౌతూహలముతోఁ గ్రమ్మరం జనుదెంచి

యమ్మహాముని సమక్షమందు యథానిర్దిష్టముగాఁ గూర్చుండిరి. అర్ధయామావశిష్టమగు రాత్రియందు సుధాకరకిరణములచే జగంబంతయు వెండిపూసినట్లు ప్రకాశింపుచుండ మలయమారుతములు మేనులకు హాయిసేయ హారీతకుఁడు మధురఫలరసంబుల నన్నుఁ దృప్తుంజేసి మునులతోఁగూడ నతనియొద్దకుఁ దీసికొనిపోయి వేత్రాసనంబునం గూర్చుండి జాలపాదుఁడను శిష్యుండు పవిత్రపాణియై మెల్లగాఁ దాళవృంతమున వీచుచుండ రెండవపరమేష్టివలె నొప్పుచున్న యా జాబాలికి నమస్కరించి నన్నెదుర నిలిపి వినయంబున నిట్లనియె.

తండ్రీ ! యీ మునులందరు నీ చిలుక వృత్తాంతము వినుటకు మిక్కిలి వేడుక పడుచున్నారు. ఇది తొలిజన్మమందెవ్వరు ? ఎందుండునది ? ఏమికారణమున నిట్టిజన్మమెత్తినది? సవిస్తరముగా నుడువుఁడని యడిగిన నజ్జడదారి సంతసించుచు వారినందరను గలయఁ గనుంగొని యిట్లని చెప్పఁదొడంగె.



# తారాపీడుని కథ



క॥ కలదుజ్జయినీ నగరం
బిలను మహాకాళ నామకేశ్వరలింగా
మలదీప్తి దీపితాలయ
కలితంబై చారుసౌధ కమనీయంబై॥

అప్పీటి కధినాయకుండై తారాపీడుండను రాజు రాజ్యంబు సేయుచుండెను. అతండు నృగ, నల, నహుష, భరత, భగీరథ, ప్రభృతు లగు పూర్వనృపతుల నతిశయించిన కీర్తిగలవాఁడై నీతి శాస్త్రపారంగతుండును, ధర్మజ్ఞుండును, యజ్ఞపూత విగ్రహుండునునై

రెండవధర్మదేవతవలెఁ బ్రజలం బాలింపుచుండెను.

అతనియొద్ద సకలకలానిపుణుం డగు శుకనాశుండను మంత్రి ముఖ్యుండు గలఁడు. అతండు బ్రాహ్మణుండయ్యును క్షాత్రంబున నత్యంత ప్రసిద్ధిఁ జెందియుండెను. చంద్రునకు వెన్నెలవలె నమ్మహా రాజునకు నలంకారమై విలాసవతి యను విలాసినీ లలామంబు మహిషీ పదం బధిష్టించి యెక్కుడు మక్కువగలుగఁ జేయుచుండెను.

ఆరాజు సప్తద్వీపముద్రితంబైన ధరావలయం బంతయు భుజ బలంబున జయించి మంత్రి న్యస్తరాజ్యభారుండై యచ్చరలం బుర డించు మచ్చెకంటులం గూడికొని గృహదీర్ఘికలయందును శృంగార సరోవరంబులయందును కేళికోద్యానములయందును క్రీడాశైలముల యందును నభీష్టకాముఁడై విహరింపుచు యౌవనమున ననవద్యమగు సుఖం బనుభవించెను.

ఒకనాఁ డా యెకిమీడు విలాసవతీ భవనంబున కరుగుటయు నప్పు డప్పడతి చింతాస్థిమితదీనదృష్టులతో శోకంబున మూకభావము వహించి చుట్టును బరిజనంబు బరివేష్టింపఁ గన్నీళ్ళచేఁ దుకూలము దడుపుచు నెడమచేతిపై మో మిడుకొని శయ్యపైఁ గూర్చుండి చింతించుచు భర్తరాకఁ దెలిసికొని ప్రత్యుదానాదివిధులం దీర్చినది.

అప్పుడా నరపతి యాసతీవతంసంబును దొడపై నిడుకొని కన్నీరు దుడుచుచు దేవీ! నీవేమిటి కిట్లు ముక్తాఫలజాలంబులఁ బోని యశ్రుబిందుసందోహంబుల రెప్పల గుప్పుచుంటివి? కృశోదరీ! ఏమిటి కలంకరించుకొంటివి కావు? నీ విరక్తికిఁ గారణ మేమి? నేను నీకెద్ది యేని యనిష్టమైన పనిఁ, గావించితినా చెప్పుము. నా జీవితము రాజ్యము నీ యధీనమై యున్నవి. వేగము విచారకారణం బెఱిం గింపుమని బ్రతిమాలుకొనియెను.

అప్పుడయ్యంబుజాక్షి తాంబూలకరండవాహిని మకరికయను

నది మెల్లన నాభూవల్లభుని కిట్లనియె. దేవా! దేవర దేవిగారివిషయమై కొఱంత యేమియుఁ జేసియుండలేదు. వినుండు. నాకీమహారాజుతో సమాగమము విఫలమైనది గదా యని యమ్మగారు చింతించు చుండఁగనే చాలకాలముగతించినది. శయనాసనస్నానభోజనభూషణ పరిగ్రహాదులగు దివసవ్యాపారములఁ బరిజనప్రోత్సాహంబున నెట్టకే కష్టంబునఁ గావింపుచుండునది. అట్టి వికార మెన్నఁడును హృదయ పీడాజనితంబై చేఁ దెలియనిచ్చినదికాదు. నేఁడు శివరాత్రి యను మహా కాళసాధు నారాధింప దేవళమున కఱిగినది. అందొకచో మహాభార తము జదువుచుండఁ గొంతొకసేపు కూర్చుండి యాలకించినది. అందు సుతులు లేనివారికి గతులు లేవనియుఁ బున్నామ నరకము బుత్రులు గాని తప్పింపలేరనియు లోనగు వృత్తాంతముల విని యింటికి వచ్చి నది మొదలావిషయమే ధ్యానించుచు మే మెంత బ్రతిమాలినను గుడువక కట్టక ప్రత్యుత్తర మీయక యిట్లు దుఃఖించుచున్నది. ఇది యే యీమె శోకకారణమని పలికి మకరిక యూరకొన్నది.

ఆ కథవిని యొడయం డొక్కించుకతడవు ధ్యానించి వేడినిట్టూర్పు నిగుడింపుచు నిట్లనియె. దేవీ! యూరడిల్లుము. దైవాయత్తమగు కార్యమునుగురించి మన మేమిచేయగలము. దేవతలకు మనయెడఁ గనికరములేకపోయినది. వెనుకటిజన్మమున మంచికర్మ చేసితిమికాము. ఇటుపిమ్మట మనుష్యులకు శక్యమైన పనులెల్లఁ గావింతముగాక. గురుభక్తి నిబ్బడిగాఁజేయుము. దేవపూజలు విశేషముగాఁ గావిం పుము. మునిజనసపర్యల నాదరముతోఁ జేయుము. వారు దుర్లభము లైన వరముల నీయఁగలరు. చండకౌశిక ప్రసాదంబున బృహద్ర థుండు జరాసంధుండను పుత్రుం బడయలేదా? దశరథుండు వృద్ధుం డయ్యు విభండకనందను నారాధించియే కాదా! రామలక్ష్మణభరత శత్రుఘ్నులను పుత్రులం గాంచెను. మునిజనసేవ యెన్నఁడును

వ్యర్థము గాఁజాలదు. దేవీ! నీకేమని వక్కాణింతును. రాత్రిం
బగళ్ళు ననపత్యతాదుఃఖాగ్ని నన్ను దహించుచున్నది. రాజ్యంబును
జన్మంబును విఫలమని తలంతును. తలోదరీ! కమల గర్భుండు మనకు
ప్రసన్నుఁడుగాఁడయ్యెను. నేనేమి జేయుదును. నీ శోకానుబంధము
విడువుము ధైర్యమవలంబింపుము. బుద్ధిని ధర్మకార్యములందుఁ
బ్రవేశపెట్టుము. అని శోకాపనోద నిపుణంబులగు ప్రియవాక్యంబు
లచే నత్తలోదరి నాశ్వాసించి కొంతతడవందుండి యతండు నిజభవ
నంబున కఱిగెను.

అది మొదలమ్మదవతియు దేవతారాధనములయందు బ్రాహ్మణ
పూజలయందును వెనుకటికన్నఁ బెద్దగా నాదరముగలిగియుండెను.
పుత్రోదయ హేతుభూత మగు వ్రత మెవ్వరెట్టిది చెప్పినను గష్టముల
కోర్చి యట్టిదిగావించునది. చండికాయతనంబుల శయనించి యనే
కోపవాసములఁ గావించినది. వృద్ధగోపవనితలు మన్నింప సర్వలక్షణ
సంపన్నంబులగు గోవుల పొదుగులదాపున నిలచి సర్వౌషధీమిశ్రి
తంబులగు పాలతో స్నానంబు గావించినది. కనకమణి వినిర్మితము
లగు తిలపాత్రముల దానములిచ్చినది. అనేకసిద్ధాయతనముల సేవించి
నది. ప్రసిద్ధములగు నాగహ్రదంబుల మునింగినది. అశ్వత్థప్రభృతివన
స్పతులకుఁ బ్రదక్షిణము లొనర్చినది. నడివీధుల దధ్యోదనము వాయ
సములకు బలివైచినది. భక్తితో నగ్నక్షపణకాదుల నెందరినో ప్రశ్న
లడిగినది. నిమిత్తజ్ఞుల నారాధించినది. వృద్ధులు జెప్పిన రహస్యక్రియ
లన్నిటిని గావించినది. ఉపశ్రుతుల నాలించినది. నిమిత్తముల గ్రహిం
చినది. తనకువచ్చు స్వప్నవిశేషంబులు గురువులకు నివేదించునది.

ధృతవ్రతయై యయ్యువతి యట్లు చేయుచుండ నొకనాఁడు
తారాపీడుండు అల్పావశేషమగు రాత్రియందు సమున్నత సౌధాగ్ర
వర్తినియై యున్న విలాసవతీదేవి మొగంబున సకల కలాపరిపూర్ణుం

డగు చంద్రుండు ప్రవేశించుచున్నట్లు కలఁ గాంచెను. దిగ్గున లేచి సంతోషాతిశయముతో నాక్షణమునందే శుకనాసుని రప్పించి యా వృత్తాంత మెఱింగించుటయు హర్షపులకిత గాత్రుండై యతం డిట్లనియె.

దేవా ! శీఘ్రకాలములో మనప్రజల మనోరథములు సఫలములుఁ గాగలవు. కొలఁదిదినములలోఁ గుమారముఖావలోకనసుఖం బనుభవింపఁగలము. మద్ధర్మపత్ని యగు మనోరమ తొడయందొక బ్రాహ్మణుండు దివ్యవస్త్రాలంకారభూషితుండై యరుదెంచి సహస్రదళశోభితంబగు పుండరీక ముడిచినట్లు నాకును నిన్నరాత్రియే కల వచ్చినది. మంచి నిమిత్తములు గనఁబడుచున్నవి. శుభోదర్కము దాపుననే యున్నదని పలుకుటయుఁ దారాపీడుం డతనిచేయి బట్టుకొని హృదయానందమును వెల్లడించుచు నంతఃపురమునకుఁ దీసికొనిపోయి యిరువుర స్వప్నవృత్తాంతములును విలాసవతి కెఱింగించి సంతోష సముద్రములో నోలలాడించెను.

మఱికొన్నిదినంబులు గతించినంత దేవతాప్రసాదంబున విలాసవతి గర్భవతియయ్యెను. కులవర్ధన యను ప్రధానదాసి యొకనాఁ డావృత్తాంతము శుకనాసునితో ముచ్చటించుచున్న ఱేని చెవిలో వైచినది. అశ్రుతపూర్వమగు నవ్వాక్యము విని యజ్జనపతి మేనం బులకలుద్భవిల్ల సంతసమభినయించుచు శుకనాసుని మొగ ముపలక్షించెను. శుకనాసుండయ్యుత్సవము గ్రహించి దేవా ! మనకు వచ్చిన కలలు సత్యములైనవా యేమి ? వినుదనుక నాహృదయము తొందరపడుచున్న దని యడిగిన నతండు సంతోషముతో దాది చెప్పిన మాటల నెఱింగించెను.

రాజప్రధాను లిరువురు నిరతిశయసంతోష సముద్రమున మునుంగుచు నప్పుడే శుద్ధాంతమున కఱిగి యావార్త సత్యమని

తెలిసికొని బ్రాహ్మణులకు షోడశమహాదానంబులును గావించిపుత్త్రో దయసమయ మరయుచుండిరి.

అంతఁ గాలక్రమంబునఁ బ్రసవసమయము సంపూర్ణమైనంత నద్ధరాకాంతు నిల్లాలు శుభదివసంబున నుత్తమలగ్నంబున నంబుద మాలిక యిరమ్మదమునుబోలె సకలలోక హృదయానందకరుం డగు కుమారుం గాంచినది.

అప్పు డంతఃపురజనులు భూమిచలింప నిటునటు పరుగులిడు వారును మంగళగీతముల బ్రయోగించువారును తూర్యనినాదములు వెలయించువారునై కోలాహలధ్వనులచే నాదేశమునెల్ల నిండింపఁ జేసిరి. ఆనగరమందే కాక యాదేశమందెల్ల జనులుత్సవములు సేయం దొడంగిరి.

తారాపీడుఁడు శుకనాసునితోఁగూడ బుత్త్రుం జూచు వేడుక బ్రబలదూర్వాప్రవాళమాలాలంకృతంబైన సూతికా గృహంబున కరిగి యందుఁ దొలుత నుదకము నగ్నిని స్పృశించి పిమ్మట విలాస వతి తొడపై దీపమువలెఁ బ్రకాశించుచున్న కుమారు దూరవిస్ఫారిత ములగు నేత్రములచేఁ బానము జేయువాఁడుంబోలె నీక్షించుచు మిక్కిలి సంతోషించెను. తన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచు కొనియెను.

అప్పుడు శుకనాసుం డాబాలకుని యవయవములన్నియు నిరూ పించుచు నిట్లనియె. దేవా! చూడుము. గర్భసంపీడనవశంబునం జేసి యంగశోభ స్ఫుటము గాకున్నను జక్రవర్తిచిహ్నములఁ బ్రకటన జేయుచున్నవి.

సంధ్యాకిరణరక్తుండగు బాలశశిరేఖంబురడించు లలాటపట్టిక యందు నళినీతంతువులం బోలిన సూక్ష్మరేఖలెట్లు ప్రకాశించుచున్న వో పరిశీలింపుము. ఆకర్ణాంతవిశాలములై పుండరీకమువలెఁ దెల్లనై

కుటిలములైన కనుబొమ్మలచే ముద్దులు మూటగట్టుచు వెలికాంతుల వెదజల్లుచున్న పీని కన్నులగంటివా ?

సీ. కరతలంబులు సుకోకనదకుట్మలలోహి
తములు చక్రాదిచిహ్నములనొప్పె
బదయుగంబమరమ్రదు పల్లవమ్మృదులంబు
కులిశధ్వజాది రేఖలఁదలిర్చె
ఫాలంబు శిశునిశాపాలాభిరామంబు
సార్వభౌమాంకలక్షణత మెఱసె
గనుఁగవ సితపద్మ కమ్రంబు త్రిభువన
ప్రభుతానుభావ వైభవముదెలిపె.

గీ. గంటివే పీని రూపముత్కంఠవొడమ
నోనరేశ్వర ! వింటివే పీనికంత
రవము దుందుభివలె సుస్వరతనెసంగె
పీఁడు ప్రోవఁగఁజాలు నీవిశ్వమెల్ల.

అని యబ్బాలకశిఖామణి యంగశోభావిశేషముల వర్ణించుచున్న సమయంబున ద్వారస్థులన్నెల్లఁ ద్రోసికొనుచు నతిరయంబున నొకపురుషుం డరుదెంచి ఱేనికిమొక్కి దేవా ! విజయమగుఁగాక. శుకనాసునిభార్య మనోరమకు రేణుకకుఁ పరశురాముండు వోలెఁ గుమారుం డుదయించె నని విజ్ఞాపించెను.

అమృతోపమితములగు నప్పలుకులు విని యజ్జనపతి బాష్పపూరితనయనుండై యోహో ! కల్యాణపరంపర ! మిత్రమా ! శుకనాస ! విధి సమానసుఖదుఃఖత్వమును సూచింపుచు నీడ వోలె నన్నను గమించెంగదా ? అని పలుకుచు నా వార్త తెచ్చిన పురుషునకపరిమితముగాఁ బారితోషికమిచ్చి యప్పుడ యప్పుడమిఱేఁడు ప్రగ్గడతోఁగూడ నతనియింటికరిగి తత్సుతముఖదర్శనంబు గావించి పుత్రో

త్సవముపంచి పెట్టించెను.

క్రమంబునఁ బురిటిరాత్రులు గడిచినంత మహావైభవముతో యథావిధి జాతకర్మాది విధుల నిర్వర్తించి, స్వప్నంబునఁ జంద్ర మండలము సతీముఖంబునం బ్రవేశించుచున్నట్లు చూడఁబడుటం జేసి రాచపట్టికిఁ జంద్రాపీడుఁ డని పేరుపెట్టెను.

శుకనాసుఁడును, రాజానుమతి బ్రాహ్మణకులోచితములైన విధులన్నియుం దీర్చి కుమారునకు వైశంపాయను డని నామకరణము జేసెను.

కాలక్రమంబున నాఁబాలునకు శైశవ మతిక్రమించినంతఁ దారాపీడుఁడా నగరమున కనతిదూరములో మనోహర మణిశిలా లలితమగు విద్యామందిరము గట్టించి సకలవిద్యాపారంగతు లగు నుపాధ్యాయులఁ బెక్కండ్ర నియమించి వైశంపాయనునితోఁ గూడఁ జంద్రాపీడుం జదివింపుచుండెను.

రాజపుత్రుఁడు మంత్రిపుత్రునితోఁగూడ ననన్యగతమానసుండై యచిరకాలములో నాచార్యులవలన మణిదర్పణముల వలె నశ్రమముగా సమస్తవిద్యలుం గ్రహించెను.

సీ. మఱి పదవాక్యప్రమాణంబులను శబ్ద
శాస్త్రమ్మునం దర్థశాస్త్రమందు
నయశాస్త్రముల నభినయశాస్త్రములఁ జాప
చక్ర కృపాణాది సాధనముల
రజతురంగాది శిక్షలఁ జిత్రరత్న ప
రీక్షల యంత్రతాంత్రికములందు
గావ్యనాటకవరాఖ్యాయికాదుల సర్వ
లిపి సర్వభాషా విలేఖనముల.
గీ. గ్రంథరచనల శిల్పకర్మల నశేష

కళల శృంగారరస దలంకారములను
సకలవిద్యల నక్కుమారకుల కప్పుడు
కలిగె నత్యంత పాండిత్య కల్పనంబు.

మఱియు నారాజపుత్రునకు బాల్యమునందె సర్వలోక విస్మయ జనకమగు మహాబలంబు గలిగియుండె.

యదృచ్ఛముగా నెదురుపడిన కరికలభంబుల చెవులు పట్టుకొని వంచిన నవి సింహపోతభంజితములవలెఁ గదలలేక నిలువంబడునవి.

కదళీకాండములవలెఁ దాళవృక్షముల నొక్కవ్రేటున నరికి వైచును. పరశురామునివలె నతం డేయు బాణములచేఁ బర్వత ములు గూడఁ జిల్లులుపడుచుండును. పదుగురు మోయలేని యినుపదండ మవలీలఁ గేలం దాల్చి గిరగిరఁద్రిప్పును.

ఒక మహాశక్తి తక్క తక్కిన విద్యలన్నియుఁ జంద్రాపీడు నితో సమముగా వైశంపాయనుఁడు గ్రహించెను. విద్యాపరిచయ బహుమానంబున శుకనాసునియందుఁ గల గౌరవమునఁ బుట్టినది మొదలు పాంసుక్రీడ లాడుచు నేకముగాఁ బెరుగుట లోనగు కారణ ములచే రాజపుత్రునకు వైశంపాయనుఁడు రెండవహృదయమువలె విస్రంభపాత్రమగు మిత్రమై యొప్పుచుండెను. నిమిషమైన వాని విడిచి యొక్కఁడు వసింపఁడు.

వైశంపాయనుఁడును సూర్యునిదివసమువలె విడువక సంతత మనుసరించి తిరుగుచుండును. అట్లు విద్యాభ్యాసము చేయుచుండ ప్రదోషమునకుఁ జంద్రోదయమువలె సముద్రున కమృతరసమట్లు కల్పపాదమునకు ప్రసూనోద్గమముభంగి కమలవనమునకు సూర్యో దయము భాతి సౌందర్యమున కధికశోభ దెచ్చుచు నా నరేంద్ర నందనునకు యౌవనోదయమైనది.

సమయము నరసి మన్మథుఁడు సేవకుఁడువలెనే వారినాశ్రయింప

చెను. లక్ష్మితోఁగూడ వక్షస్థలము విస్తరించెను. ఇట్లు వారు సమారూఢయావనులునుఁ సమాప్తసకలవిద్యాగుణులు నగుచుండ వారివార్తవిని తారాపీడుఁడు మిగులసంతసించుచు బలాహకుఁ డను సేనాపతిఁబిలిచి శుభముహూర్తమున వారిం దోడ్కొని రమ్మని యాజ్ఞాపించెను.

అతండును విద్యాగృహమునకుఁ బోయి వైశంపాయనునితో విద్యాభ్యాసము చేయుచున్న చంద్రాపీడునిం గాంచి నమస్కరించి తదానతి నుపవిష్టుండై యిట్లనియెను.

భర్తృదారక! నీవు సకలవిద్యలయందును ప్రౌఢుడవైనట్లు విని తారాపీడుఁడెంతేని సంతసించి చంద్రదర్శనమునకు సముద్రుండు వలె నిన్నుఁ జూచుటకుఁ గోరుచున్నవాఁడు. మీరు విద్యాభ్యాసమునకుఁ బ్రారంభించి పది సంవత్సరములయినది. ఆరవయేటఁ బ్రారంభించుటచే నేటికిఁ బదియారేఁడుల ప్రాయముగలిగియుంటిరి. మీ తల్లులు మిమ్ముఁ జూచుటకు మిగుల వేడుకపడుచున్నారు. యౌవన సుఖముతోఁగూడ రాజ్యభోగ మనుభవింపుము. రాజలోకమును సన్మానింపుము. బ్రాహ్మణులఁ బూజింపుము. ప్రజలఁ బరిపాలింపుము. ఇంద్రాయుధమను తురగరత్నమిదిగో యధిష్టించిరమ్ము. మీతండ్రి గారికి దీనిఁ బారశీకదేశపురాజు సముద్రములోఁ బుట్టినదనియు నతి వేగము గలదనియుఁ గానుకగాఁబంపెను. దీనిం జూచి పరీక్షించిన వారు ఉచ్చైశ్శ్రవమునకుఁగల చిహ్నములున్నవని చెప్పుచున్నారు. చూడుఁడని పలుకగావిని యా రాజకుమారుఁడు వైశంపాయనునితోఁ గూడ నా యశ్వలక్షణములన్నియుం బరీక్షించి వెరగందుచు నది యమానుషమని చెప్పుచు దానికి ముమ్మారువలగొని యాగుఱ్ఱ మెక్కెను.

అప్పు డత్తత్తడి సంతసించు దానివలె తోక నాడించుచు సకిలించినది. అదియే శుభశకునముగాఁ దలంచి విద్యాగృహము

బయలువెడలి వైశంపాయనుఁడును వేఱొక తురగమెక్కి తోడరా రాజమార్గంబున నడుచుచుండెను.

రాజపుత్రుండు సమాప్తసకలవిద్యుండై విద్యాగృహమునుండి వచ్చుచున్నవాఁడను వార్త విని పౌరకాంతలెల్ల నుల్లము లుత్సుకోత్ఫుల్లములై యెప్పుడెప్పుడ నప్పురుషరత్నముం జూడ వేడుక పడుచు సగముసగముగా నలంకరించుకొనియుఁ బూర్తికాకుండఁగనే చేసెడి పనుల విడిచి పరుగుపరుగునఁ జరణనూపురరవముఖరితంబుగ సౌధాంతరంబుల జేరి మరకతవాతాయన వివరములనుండి యానరేంద్రనందను నీక్షింపఁదొడంగిరి.

అప్పుడా మేడలనుండి మకరధ్వజవిజయనినాదము ననుకరింపుచు రమణీమణుల మణిభూషణఘోషము శ్రోత్రపర్వముగాఁబయలు వెడలినది. ముహూర్తకాలములో నంతఃపురములన్నియు యువతిజన నిరంతరము లగుట స్త్రీమయము లైనట్లు ప్రకాశించినవి.

కౌతుకప్రసారితనయనలై చూచుచున్న యమ్ముగువల హృదయంబు లద్దములవలె నారాజసూనుని యాకృతి నాకర్షించినవి. అప్పుడావిర్భూత మదనరసావేశహృదయలై యమ్మదవతు లొండొరులు సపరిహాసముగా సాక్షేపముగా సాభ్యసూయముగా సోత్ప్రాసముగా నిట్లు సంభాషించుకొనిరి.

ఓసీ! వేగముగాఁ బరిగిడుచుంటివి. నేనుగూడ వచ్చెదఁ గొంచెము నిలువుము.

ఆహా! నీ మోహము. రాజపుత్రుంజూచినతోడనే యున్మత్తురాలవై పోయితివే? యుత్తరీయము స్వీకరింపుము.

చపలురాలా! మోహముదమ్మిం గ్రమ్ముచున్న యలకమ్ముల ముడిచికొని మరియుం జూడుము.

మూఢురాలా! శిరమునపై చంద్రలేఖ వ్రేలాడుచున్నది.

